# BY THE SAME AUTHOR

**Soundarya Manjari** —

The Bouquet of Beauty. Ancient Indian Philosophy in the Light of Modern Science. (Re. 1)

**Valmiki** —

From Savage Bandit to Sage Poet. A Psychological Drama in Seven Acts. (Rs. 1-2)

**Vasantasena** —

On the lines of Goldsmith's 'Hermit'. Mr. V. Venkataraya Sastri compares the style favourably with that of Dandin and Bharavi. (14 As.)

**Apurva Sangha Samskaranam** —

A Satire of great merit, full of human interest. With a Critical Introduction by Mr. C. R. Reddy. Also trsnslated into Kanarese. (12 As.)

**Niti Katha Sangraham** —

A few of the Æsop's Fables in easy verse, with a full glossary. Copiously illustrated. (4 As.)

**Chandrarekha Vilapam** -

The Crown of Humorous Poems and a Unique Satire and Parody. Revised by K. G. Rau. (Re. 1)

శ్రీ రస్తు

# స్నానఘట్టము

అభినవభావకావ్యము

కవిశేఖర

## కాళ్లకూరి గోపాలరాయ

ప్రణీతము

ప్రకాశకులు: విశల్యా డిపోవారు
4. ఆచారప్పన్ సందు, జార్జిటవును
మదరాసు — 1936



| కృతిభర్త: | కృతికర్త: |
| --- | --- |
| శ్రీ విక్రమదేవవర్మగారు | కాళ్లకూరి గోపాలరావుగారు |
| జయపురము మహారాజు. | |

# పీఠిక

---

ఉద్యానఘట్టము కవిశేఖర శ్రీ కాళ్లకూరి గోపాలరాయకవిగారు రచించిన కడపటిగ్రంథము. దీని కడపటిభాగము ముద్రణము నుండఁగా వారాకస్మికముగా మరణించిరి. ఈగ్రంథమునకుఁ బీఠిక నాచేతనే వ్రాయింప వలయు నన్నది శ్రీగోపాలరావుగారి కడపటి కోర్కె యని శ్రీ పురాణం సూర్యనారాయతీర్థులవారు నాకు జాబు వ్రాసి, "స్వర్గస్థు లయిన శ్రీ గోపాలరాయకవిగారి యాత్మతృప్తి కొఱకీ యంత్యోపకారమును విధిగాఁ జేసి స్వర్గతమయిన యాయన యాత్మకుఁ దృప్తి గావింతు రని నమ్ముచున్నా" నని నన్ను హెచ్చరించినారు. ఇట్టి గ్రంథమునకుఁ దగినట్టి పీఠిక వ్రాయఁగల సామర్థ్యము నాకున్నను లేకున్నను, గ్రంథకర్తగారి చివరికోర్కె తీర్చుట నాకు విధి యైనది. నాకట్టి సామర్థ్య మున్నదని, వారి కోర్కె నేను దప్పక తీర్తు నని వారు నమ్ముకొనియే యీభారము నామీఁద వేసినా రని వారి సౌందర్యమంజరియందలి

"ఆంధ్రాంగ్లవిద్వాంసు లైననే కాని
నా దారి సుగమంబు కా దెన్నొయెడల
నృపతియుం గార్యదర్శియు నమాత్యుండు
నాప్తమిత్రుండు—వీ రందఱుం జూడ
నుభయపాండిత్యాఢ్యులు." I, 81-5.

"చతురుండు, హితకారి, సారస్యమూర్తి,
కవిమార్గదర్శి, భూధవు కార్యదర్శి,

.........................

వెట్టిలక్ష్మీనరసింహనాయకుఁడు.”     VI. 103-8

అను వాక్యములు తెలుపుచున్నవి. జీవితులై యున్నయెడల, నా యశక్తిని వారికి నివేదించుకొని నేను జెప్పుకొనుటకుఁ బ్రయత్నించి యుందును. వారిమరణముమూలమున నా కీపని తప్పనిసరి యైనది.

సౌందర్యమంజరిలో కవి త్రొక్కినదారి యాంధ్రాంగ్లవిద్వాంసు లైనవారికే తప్పఁ దదితరులకు సుగమము కాదని యాయనయే చెప్పుకొనెను. దానికి మున్నుడి వ్రాసిన డాక్టర్ సర్ యస్. రాధాకృష్ణపండితులంతటివారు తద్గ్రంథమును “వివేచనతో గ్రహింపవలయునన్న, ఆధునికభౌతికశాస్త్రజ్ఞానమును, భారతీయసనాతనభావపరిచయమును ఆవశ్యకములు.” అని నుడివిరి. దానికి విపులముగా సవిమర్శకముగాఁ బరిచయము వ్రాసిన శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు తత్ “కావ్యరచనయందు వేదాంతమంత్రయోగశాస్త్రములు కావ్యాలంకారకళాశాస్త్రములు మొదలగు శాస్త్రార్థములు రససమ్మేళనము పొందిన” వని తెలిపి, “అద్వైతము ద్వైతము వేదాంతము శాక్తేయము ప్రకృతిసౌందర్యవిలాసములు మొదలగు విద్యలు కళలు” కావ్యరససిద్ధికిఁ దద్గ్రంథమున వినియోగపడిన వని సూచించినారు. పయివాక్యము లన్నియు సౌందర్యమంజరికివలెనే స్నానఘట్టమునకును జెల్లును. కవి తాను స్నానఘట్టమును నడిపినపద్ధతిని జెప్పుకొనుచు,

“ఐన, నీకాలంబునందలి శాస్త్ర
విజ్ఞానమును గూడ వినియోగపఱిచి
క్రొత్త త్రోవలు త్రొక్కి క్రొత్త పోకడలు
పోవ యత్నించితి,”     VIII. 240-3.

అని వ్రాసిరి. ఇన్నివిధములైన శాస్త్రములు విద్యలు కళలు మొదలగు నవి యెఱిఁగి, యా యెఱుకను దమ యీ కృతిని జూపిన శ్రీ గోపాలరావుగారి యాశయములును భావములును నాకుఁ బూర్తిగా బోధపడిన వని నేను బలుక సాహసింపను. అవగాహనలోపమున నేను బడిన పొరపాటులను విజ్ఞులు మన్నింతురుగాక!

సౌందర్యమంజరీసంకల్పమే స్నానఘట్టసంకల్పము; అనఁగా, స్నానఘట్టమునందును రసరాజమైన శృంగారము సమాశ్రయము; మంజరి ఛందస్సు; కవితను నవతను జూపించుట యుద్దేశము; శ్రీ శ్రీ శ్రీ జయపురమహారాజుగారికిఁ గృతి యంకితము. ఒక్క భేదముమాత్ర మున్నది. సౌందర్యమంజరి భావచిత్రకకావ్యము; స్నానఘట్టము వస్తుచిత్రకకావ్యము. ఇందుఁ గవి "కన్నది కన్నట్టు లున్న దున్నట్టు" లొక కథ చెప్పుటకుఁ బూనుకొనినాఁడు.

కథ కడుఁ జిన్నది. దానికి నాయికయే కాని ప్రత్యేకనాయకుఁడు లేఁడు. మూర్తీభవించిన స్త్రీ సౌందర్యమే కథానాయిక. ఆ సౌందరీనాయిక స్నానఘట్టమునకుఁ బోయి, వస్త్రధావనానంతరమునఁ గొలన నీరాడి, నీటిబిందెతో నింటికి నిష్క్రమించుట యను నది కథావస్తువు. ఈ చిన్నకథ నాధారము చేసికొని కవి తన భావనాశక్తిని బరుసులువాఱించి ప్రకృతివర్ణనము, స్త్రీ సౌందర్యవర్ణనము, ద్రష్టృమనోవస్థాభివర్ణనము మొదలగునవి విరివిగాఁ జేసి, తాను సౌందర్యోపాసకుఁ డన్న విషయమును సౌందర్యమంజరిలో నున్న దానికంటె హెచ్చుగా వ్యక్తీకరించినాఁడు.

"బాల్యంబునుండి నీ భక్తుండ నంబ!
దయ మీఱ నాయందుదయమందవమ్మ," III. 86-7.

అని కవి సౌందర్యమంజరిలోఁ జేసినసంప్రార్థనము స్నానఘట్టమందే యెక్కువగా సఫలితమైనట్లు కనఁబడుచున్నది. స్నానఘట్టమునకుఁ

గవి యుద్దేశించిన మాఱుపేరు సౌందర్యవర్ణనము (A Pen-Picture of Beauty).

ఈస్నానఘట్టము ౧౦౩౬ పంక్తులుగల చిన్నకృతి. సౌందర్య మంజరికంటె సుమారు ౧౦౦ పంక్తులుమాత్రమే హెచ్చు గలది. అంజేమభాగము లున్నవి; స్నానఘట్ట మెనిమిది సోపానములుగా విభాగింపఁబడినది.

I. అవతారిక (ప్రథమసోపానము). ఇందుఁ గృతిప్రశంస, కృతిపతిప్రశంస కలవు.

II. రంగావతరణము (ద్వితీయసోపానము). కాంచీపురమందలి కాసారతీరమునఁగల వనము రంగస్థలము: కాసారమందు వనము ప్రతిఫలించి పాతాళభువనమువలె నున్నది. ధర యెల్ల మేల్మిబంగరు నీరు వోసి పూఁత పూసినయట్లు పొదలుచున్న తొలిసంజ కాలము: ఇనకరాలింగనమునను, అలినీసఖుల మేలుకొల్పుఁబాటలను బద్మిని మేలుకొనినది. అది ఫలపుష్పదమైన వసంత మగుటచేత, ఎటఁ జూచి నను వల్లికావృక్షదాంపత్యము, వాసనాప్రసవదాంపత్యము: మాధవి సహకారవల్లభుని సందిటం బొదవినది; పారావతము లహరానురాగ మునఁ గూజితములు చేయుచుండెను; మలయానిలవరుఁడు మెలమెల్ల నూఁప నవసుమవధువు లతాడోలలో నూఁగసాగినది. "స్థలకాల పాత్రల బల మింత యుండ, నెవరిచే నేమి చేయింపఁడు మరుఁడు?" అని కవి నాయికాప్రవేశమున కానుకూల్యము కలిగించెను.

III. పాత్రప్రవేశము (తృతీయసోపానము). చంద్రసాహాయ్యము లేమి మన్మథుఁడు తన ధ్వజమెత్తి విజృంభింపకుండుటంజేసి యా లోపమును దీర్చుటకోయనునట్లు చంద్రాస్యయు, మీనాక్షియు నైన కథానాయిక రంగస్థలమునఁ బ్రవేశించినది. అతిసురూపయు నైన

చందంబు గూర్చు యౌవనం బా సకలాంగసుందరికి నమితశోభ ఘటించుచుండెను. పశుపక్షులలోఁ బురుషజాతికే హెచ్చుసొగసు పెట్టిన సృష్టికర్త మానవులలోఁ బురుషజాతి యసహ్యముగాఁ గాని పించునట్లు చేసె నని కవి యిప్పట్టున నిర్ణయించి, యాపైని వ్రాసిన

“మృగఖగాదులు తన కే మొరగించె ?
మనుజులు త న్నేమి మన్నింపరైరి ?” III. 63-4.

అన్న బ్రహ్మోపాలంభనము వైజయంతీవిలాసమందలి

“తనకు నేమి త్రవ్వి తలకెత్తి రమరు ? లీ
యుర్విమనుజు లేమి యొసఁగరైరి ?
నింగి వారసతుల నిర్మాతృకలఁ జేసి,
పుడమి మాతృభూతముల సృజించె.”

నన్న పద్యభావమును దలఁపునకుఁ దెచ్చుచున్నది. మానవస్త్రీసౌందర్యము వర్ణనాంశము కావున మానవపురుషరూపనిరసనము సముచితమేయేమో ? పురుషుల యధికారధనకీర్తు లన్నియుం గలిసి కలికి చందమున నాకర్షింపలేవనుటయు నాహేతువుననే కావచ్చును. అట్టి యాకర్షణము మూలముననే ద్రష్టలు సిగ్గు విడిచి సౌందరీనాయికను దేఱిపాఱఁజూచుటయు, నామె లజ్జావనతాస్య యగుటయు జరిగెను. స్నానఘట్టమున ద్రష్ట లుండుటయు, నట్లు చూచుటయుఁ గ్రొత్తలు కావు. సిగ్గును విడుచుటకు ఫలముగా వారు సౌందరీదేవీ ప్రసాదము గనిరి.

“సిగ్గొకండు పరిత్యజించెడి వాఁడు
ముల్లోకములు గెల్చు మొత్తంబుమీఁద,” III. 89-90.

అన్న కవివాక్యము వెక్కిరింతగా వ్రాసినది కాదని యటుమీఁద వచ్చెడి సందర్భములనుబట్టి చదువరు లెఱుంగఁగలరు.

IV. వస్త్రధావనము (చతుర్థసోపానము). నాయిక సిగ్గునఁ గాలఁకులఁ దిలకించి, తల వంచుకొని పురుషులు లేనివైపునకు మరలి, రైక యొడల్చి నీరముల ముంచి, రాతిమీఁద నుదికి, జాడించి పిడిచినది. ఈ ఘట్టమునందలి ౨౧-౩౭ పంక్తులయందలి శృంగారవర్ణనము

“ యతి విటుఁడు కాకపోవు టెట్లు సద్దియు
కావ్యశృంగారవర్ణనాకర్ణనమున ?”

అని చెప్పుకొనుటకుఁ దగిన ట్లున్నది. అయ్యాది కవి “పూర్వకాలంపుఁ బ్రామాణికకవుల పద్ధతింబట్టి స్వాతంత్ర్యము వహించి” వ్రాసినది కానోపును. నాయిక రవిక యుదుకుకొనుచున్నంతసేపును ద్రష్టలు “నీతికోవిదు లయ్యు నిజదంభ ముడిగి యోరవల లెత్త కేశాగ్రతం బూని యాలేమసౌందర్య” మరయుచునే యుండిరి. అవును! ఇతరులకు శ్రీరంగనీతుల నుపన్యసించువారికైనను స్వప్రయోజనావసరమున మనస్సులు “రంగులు బయల్పడఁగఁ గలరూపుఁ జూపుఁ, బల్కులగాజులోనఁ బ్రసరించు విమలప్రభారేఖవోలె!” ఇదియును వెక్కిరింతవాక్యము కాదు; స్వభావకథనము. ఆపైని ఆమెచీర పలు తెఱఁగుల వర్ణింపఁబడినది. ఒకకొంగు చుట్టి, యింకొకకొంగు పట్టి, యిట్టివిధముగా నామె చీర యుదుకుకొన్నది. ద్రష్టలు చూచుచునేయుండిరి; వారు చూడనియట్లామె నటించెను. “తత్సౌభాగ్యశోభ దర్శించినయతండె ధన్యోత్తముం” డని ప్రశంసించి,

“ దాఁచెడి వస్తువుం జూచెడి కోర్కి
దౌర్లభ్యముకొలందిఁ దనియించుచుండు” IV. 121-2.

అని కవి మానవస్వభావదౌర్బల్యమును ద్రష్టలచర్యకు హేతువుగా నిరూపించెను.

V. స్నానము (పంచమసోపానము). తదనంతరము సౌందరీ నాయిక నీటిలోనికి దిగినది. ఎంతసేపటికిఁ దన్నెడనీ పోకున్న యువలకుఁ గాన్పింపకుండ శిరమెల్లఁ దత్సరోవరమున ముంచి కాలము గడిపినది. చెలఁది నీట మునుంగుకొలఁది ద్రష్టల మనోవికారములు హెచ్చఁజొచ్చినవి: వారు నిశ్చేష్టులైనారు; ఏమేమో భ్రాంతులు పొందినారు; ఉన్మత్తులైనారు.

VI. ఉత్తరణము (షష్ఠసోపానము). స్నానానంతరమున నాయిక క్షీరసాగరమథనకాలమునఁ దత్సాగరమునుండి వెడలిన లక్ష్మి వడువున జలువడి, మొలబంటినీట నిలిచినది. తడిబట్ట యొంటి కంటి పెట్టుకొనియుండుటఁబట్టి స్పష్టములైన యంగముల ద్రష్ట లదేపనిగాఁ జూచుచుఁ దన్మయులైరి. అంతలో నాయిక నీటను బిందె ముంచి, రవిక మొలను దోఁపుకొని, జలకలశముతో నొడ్డు చేరినది.

VII. నిష్క్రమణము (సప్తమసోపానము). బిందె యొక చంకను బెట్టుకొని, తామరపువ్వుల నత్తిని రెండవచేతను బట్టుకొని, నాయిక యింటికి బయలుదేఱెను. ద్రష్టలు తత్తరపడి యామెను బట్టుకొనఁ బోయి, యంతలో వివేకము తెచ్చుకొనిరి. అప్రయత్న పూర్వకముగా వారు చేతులు చాఁచిరి కాని, కన్నెత్తి వారిని గననైనఁ గనక యామె రంగస్థలమును విడిచిపోయెను. ద్రష్టలకు కన్నులఁ జీఁకట్లు క్రమ్మినవి. వారి దేహములఁ గామమనెడి నిక్కాక జీర్ణించి ముమ్మరమైన మోహజ్వరముగా మాఱినది. అలసత, చపలత, ఉన్మాదము, సన్నిపాతము, అపస్మారము,...తుదకు మ్రాఁగన్నుతోడి సుప్తి – యీ యవస్థలు వారికిఁ బ్రాప్తించినవి. ఆమె యంతకంతకును దూరమై యస్పష్టయై మాయమైనది. ద్రష్ట లామెమూర్తిని మనోవీథిని ధ్యానించి, యావాహనాద్యుపచారములతోఁ జత్సొంవర్య దేవతార్చనము సలిపి, సాయుజ్యము పొందిరి.

"మన్మథశ్రుతిని చేవస్మృక్తి యిదియో !
యిదియో బ్రహ్మానంద ! యిదె భక్తిఫలము !
ఇదె జన్మసాఫల్యము !" VII. 112-3.

-అని యంబరవాణి ఘోషించెను. కథ కంచిలోనే ముగిసినది. కథ చదివినవారికి, విన్నవారికి నిహపరముల నహరహము నను యజ్ఞపుణ్య ఫలము కలుగు నన్నది ఫలశ్రుతి.

VIII. నివేదనము (అష్టమసోపానము). స్నానఘట్టమున నిదే వ్యాసఘట్టమువంటిది. ఇం దనేకవిషయములు ప్రసంగింపఁబడినవి.

చైతన్యశక్తి యదృశ్యస్థితియం దాకర్షణాపకర్షణరూపములను ధరించి, విశ్వమును సృజించును; దృశ్యస్థితియందు స్త్రీపురుషరూపములను ధరించి, ప్రాణికోటిని సృజించును. ఈ సృష్టిక్రమమునం దితరప్రాణికోటియే ప్రకృతిధర్మములను బాటించుచున్నవి గాని మనుష్యకోటి పాటించుట లేదు. ఋతుకాలమును దప్పించి సంభోగించుట, గర్భిణీభోగము ఇత్యాదు లుదాహరణములు. మనుష్యులు పశుపక్ష్యాదులతోడి కలయిక మూలమున సృష్టిక్రమము సాగించుటయును బ్రకృతిధర్మమునకు విరుద్ధమే. అట్లుగాఁ బుట్టినవాఁడు ఋశ్యశృంగుఁడు. పురుషసంపర్కము లేకుండఁ బుట్టినట్లు మన పురాణములు కర్ణుని జేర్కొనుచున్నవి; బైబిలు క్రీస్తును జేర్కొనుచున్నది. ఆపైని, ఏటికిని గొండకును గిరిక పుట్టినదఁట! ఈ సృష్టిక్రమ మంతయు నద్భుతము. ఎంత సత్యమో దేవునకే యెఱుక. మానవస్త్రీపురుషమూలమున జరిగిన సృష్టిక్రమము తరువాతఁ బరీక్షింపఁబడినది. పూర్వము పరిణయనియమము లంతగా లేవు. సంతానార్థమై యేపురుషుఁ డేస్త్రీనైనను గోరవచ్చు నన్నయాచార ముండెను. క్షేత్రజ కానీన కుండ గోళకాదు లౌరసునివలెఁ బుత్రులుగాఁ బరిగణింపఁబడుచుండిరి.

ఇప్పటి త్రివిష్టపమునం దున్నట్లు అప్పటి మన యార్యావర్తమున బహుభర్తృత్వ ముండెనేమో? ద్రౌపదికథ యీ సందేహమును గలిగించుచున్నది. తండ్రిని త్రాగించి సంతానార్థమై యతనితోఁ గూడిన లాటుకూఁతుల కథ యొకటి బైబిలునం దున్నది. అంకుతనము, బోగముతనము లేనిదేశము పూర్వమే కాదు, నేఁడును లేదు. నేఁటి పరిణయపద్ధతులును ఒక్కమాదిరిగా లేవు; దేశమున కొకవిధము, మతమున కొకవిధముగా నున్నవి. అన్నదమ్ముల బిడ్డ లాలుమగ లగుట హిందువు లొప్పరు; మహమ్మదీయులు, క్రైస్తవులు నొప్పెదురు. నాగరకము హెచ్చినకొలఁది వివాహమనునది కాంట్రాక్టు (బేరము) గా మాఱుచున్నది. ఇప్పుడు స్వైరానురాగపద్ధతి (Platonic love) యొకటి ప్రబలుచున్నది. అట్టిది పూర్వము వల్లభమతమునఁ గొంతవఱకుండెను. స్త్రీలెల్లరును రాధలును, మతపురుషు లెల్లరును శ్రీకృష్ణులు నన్నది తన్మతసిద్ధాంతము.

ఈ విధముగా మానవస్త్రీపురుషమూలక సృష్టిక్రమమును గూర్చిన వివిధవిషయములను విమర్శనాబుద్ధితోఁ గవి పరిశీలించి యీ వెనుకఁ బ్రేమమునుగూర్చి కొంత చర్చించెను.

స్త్రీపురుషుల కన్యోన్యముగాఁ గలుగు ననురక్తి పవిత్రమైనది. ఆ ప్రేమము పరస్పరాత్మార్పణము. ఆ ప్రేమభావమే శృంగారము; రసరాజము. దాని కాది యింద్రియానందమే యైనను సృష్టి దాని పర్యవసానము. సంతాననిరోధపద్ధతు లవలంబించుచున్నవారు సృష్టి బాధ్యత తప్పించుకొని యింద్రియానంద మనుభవింపఁగోరుచున్నవారు గదా? అది యటుండనిండు. ఆనందమే యందఱు నభిలషించునది. దాని కింద్రియములు సాధనములు. పంచేంద్రియములలో నేత్రఘ్రాణ శ్రోత్రములు మూఁడును ముఖ్యములు: అవి యంగసంయోగము లేకుండనే సంగమును గూర్చును. ఎంత జితేంద్రియులకైనను వాని తృప్తులఁ

బడకతప్పదు. సుఖ్యాదు లిద్యింద్రియసుఖము నప్రయత్నపూర్వకముగా ననుభవించి యానందింతురు. యోగులు కన్నులు బిగియఁబట్టి, ముక్కు మూసికొని, చెవుల వ్రేళ్లు జొనుపుకొందురు. అది యేల? ప్రత్యక్షమైన జీవాత్మను భజింపలేనివారికిఁ బరోక్షగతమైన పరమాత్మ యెట్లు లభించును? ప్రకృతిసామాన్యములైన యయ్యింద్రియముల నరికట్టుచున్నవారి కిహపరంబులు రెండును సున్న. సర్వసంగత్యాగి సన్న్యాసి యందురు గనుక సన్న్యాసమునకు సంగమే మార్గము. "కామి గాకయె మోక్షగామి కాఁ"డని సౌందర్యమంజరిలో మన్మథోపాసనయందలి సిద్ధాంతమునే కవి మఱొక్కమాఱు నొక్కి యిక్కడ వక్కాణించెను. క్రమముగా నిరోధించిననే యింద్రియములు లోఁబడును గాని, యాకస్మికబలాత్కారక్రియలకు లొంగినను, అవి విజృంభించి యత్యమితము లగు నని కవిమతము.

నేత్రఘ్రాణశ్రోత్రములలో నేత్ర ముత్తమము: దానికిఁ బరమాణుతరంగసంస్పర్శమేని యావసరము లేదు; బంధనమున దాని కితరాంగముల సాహాయ్య మక్కఱలేదు; దాని బంధనకాల మపరిమితము; దాని బలవేగము లమితములు; దానికి దవ్వును నైపును లేవు. స్త్రీపురుషాన్యోన్యశృంగారజనకమైన యంగసౌందర్యము ననుభవించుటకు నేత్రమే సాధనము. నేత్రము సౌందరీనాయికాసౌందర్యము ననుభవించుశక్తి ద్రష్టలకుఁ గలిగించినది. తాను భోగింపక ద్రష్టల కెల్లరకు నొక్కమాఱుగా నానందము కలిగించిన సౌందరీనాయిక పరమోత్తమురాలు. అట్టి సౌందరీనాయికయొక్కయు, నేత్రనాయకునియొక్కయు సరసవిలాసమే స్నానఘట్టమందు వర్ణిత మని కవి చక్కఁగా సమన్వయము చేసెను.

ఈ చివరిసోపానము కవికి మన గ్రంథములందే కాక పాశ్చాత్యశాస్త్రగ్రంథములందును మంచి పరిచయ మున్నదనియు, దద్వార

యములను గూర్చి యీయన సారముగా నాలోచనలు చేయుచుండు వాఁ డనియుఁ దెలుపును.

సౌందర్యమంజరియందువలెనే స్వానఘట్టమందును గవి మంజరి వాడుటకు సంకల్పించుకొనె నన్నది యింతకుమున్ను తెలిపినవిష యమేకదా ?

> " నటరాజదేవుండు నిటలనేత్రుండు
> ద్విపదసహస్రమూర్తి త్వ మింపారఁ
> దాండవం బొనరించి ధన్యతం గూర్ప,
> ..........................
> నాల్గు పాదంబుల నడక నా కేల?"
>
> సౌం. మం. I. 10-14.

అని ద్విపదను గోరుకొని,

> " ప్రాసంపుఁ బోట్లును వర్జనీయములు;
> నిరుపహతంబు మంజరియె గ్రాహ్యంబు."  I. 15-6.

అని మంజరి నతఁ డుపయోగించెను. రెండేసి మంజరీపాదములు ప్రాససహితము లైనయెడల ద్విపదపద్యము లగును. అట్టి ప్రాసమును మాని, యేపాదమున కాపాదమే యుండుటచేత నిది మంజరీకావ్య మైనది. అప్పకవి మంజరీద్విపదలను జాతులలోఁ జేర్చినను, రంగనాథుఁడు పాల్కురికి సోమనాథుఁడు తాళ్లపాక చిన్నన్న మున్నగు ద్విపదకావ్యకర్తలు ద్విపదలయం దుపజాతులయందుబలె బ్రాసయతులు వాడినారు. శ్రీ గోపాలరావుగారిదియు వారిమతమే. మఱియు వీరు పదమధ్యపాదావసానప్రయోగములు కొన్ని చేసినారు. అనియు రంగనాథాదులు చేసినవే. అప్పకవిమతము తా మంగీకరింప లే దని సౌందర్యమంజరియందు స్వవిషయ మని వీరు వ్రాసిన దానిలోఁ గలదు.

సౌందర్యమంజరివలె స్నానఘట్టమును సంస్కృతజటిలముగా నున్నది. అట్లని యర్థము కాకుండుభాష కాదు. నూతనసంస్కృత సమాసములవలె శ్రీ గోపాలరావుగారివియు సుగమములై శ్రావ్యములై యున్నవి. భాష నిర్దుష్టము. శైలి పేశలము.

అవసానమున రచించిన యీ కృతిద్వయమునందు శ్రీగోపాలరావుగారు క్రొత్త దారిని త్రొక్కి, దానిలోఁ జాలవఱకు నేర్పు సంపాదించినారు. ఇట్టికృతు లింకను వ్రాయుటకు భగవంతుఁడు వీరి కాయువు ప్రసాదించియుండినయెడల, వీరి మూలమున నాంధ్రభాషలో ధ్వని ప్రధానమైన భావకవిత్వముతోడి నవీనసారస్వతము కొంత యభివృద్ధి పొందియుండును.

వీరి యాత్మకుఁ బరమాత్ముఁడు శాంతి కలిగించునుగాక!

కవిభూషణ,

విశాఖపట్టణము,
1-2-1936

సెట్టి లక్ష్మీనరసింహము

శ్రీ రస్తు

# స్నానఘట్టము

## ప్రథమసోపానము

### అవతారిక

శ్రీ రస్తు, శుభ మస్తు! శ్రీగణనాథ!
అఖిలమూలాధార! యవధారు దేవ!
సౌందర్యమంజరీసంకల్ప మదియె
స్నానఘట్టమునకున్ సంకల్ప మయ్యె; 4
అయ్యది భావచిత్రైకకావ్యంబు,
ఇయ్యది వస్తుచిత్రైకకావ్యంబు.

ఈ రెంటి యైక్యంబు, హృద్యకావ్యార్థ
లక్షణాంత్యప్రలక్షితం బైన 8
భావవస్త్వనురాగవైభవం బనఁగ,
సహృదయానందభాజన మై తనర్చు.

* * * * *

ఇందు శృంగారనాయిక యై చెలంగి,
సౌందర్యమూర్తియే సాక్షాత్కరించు. 12

నవనవభావసౌందర్యసందీప్త
సారస్యసర్వస్వసంగ్రహం బనఁగ,
ప్రకృతివిలాసచిత్రంబు రహించు;
ఈశ్వరవిలసనం బిది యనిపించు.

* * * * *

కవిరాజహంసావికలవిహారముల
స్నానఘట్టము మనోజ్ఞం బగుంగాత!

## II

"నిత్యయౌవన లగు నీ కృతిసుతలు,
పాశ్చాత్త్యకన్యకాభావానుసరణి,
వరియించిరి పురాణపురుషు!" నటంచు,
ననుఁ జూచి నవ్వినన్ ననుఁ బొగడుటయె!

భావదాంపత్యప్రభావంబు నెంచి,
అచ్యుతభోగభాగ్యం బపేక్షించి,
భక్తిసమ్యక్ఛక్తి రక్తి దీపింప,
పురుషోత్తముని వరించిరి కుమారికలు;
మఱి, తమతోపాటు మరియాద మెఱయ,
కన్న నన్నుం దమ్ముఁ గొన్న మన్నిని
ధన్యమూర్ధన్యతం దనిపి రెంతయును;
గడుసుందనంపుఁబోకడ లపూర్వములు!

* * * * *

రాజయోగము రసరాజయోగంబ
కా నెంచి యేమొ, యా ఘనుఁడు రాజర్షి,
దక్షిణనాయకత్వము సార్థకముగ,
పెండ్లిళ్లమీఁదను బెండ్లిళ్లు గోరు ;
భావయౌవనపాటవం బదెట్టిదియొ ?
ఆ కృష్ణలీలామహత్త్వ మెట్టిదియొ ?

* * * * *

విక్రమదేవుండు విష్టరశ్రవుఁడు
ఆత్మాంశసంభూతు నాత్మాభిధానుఁ
దనయంతవానిఁగా నొనరించుఁగాక !

ఈ నూత్నదంపతు లితరేతరాను
రక్తులై సక్తులై రమణీయనిత్య
కీర్తిసంతతిఁ గాంచి, క్రీడలం జూచి,
ఆత్మసందర్శనం బైనట్లు తోఁప,
ఆనందపరవశు లగుదురుగాత !

## III

శ్రీమన్మహారాజ ! శ్రితకల్పభూజ !
ప్రథితసద్ధర్మ ! విక్రమదేవవర్మ !
జయపురప్రాజ్యరాజ్యరమాకళత్ర !
దివ్యపవిత్రసంభావ్యచరిత్ర !

ప్రకటసాహిత్యసమ్రాడ్బిరుదుఁడవు ;
నీ కేమి చెప్పి, నిన్ మెప్పింప నేర్తు ?
అయిన, గుణగ్రాహి వగుచుండ వనెడి
చనవె మత్సాహసోత్సాహకారణము.

* * * * *

రాజ్యలక్ష్మీవిహారవినోదవేళఁ
గావ్యకన్యాకరగ్రహణంపువేళ
సమలకీర్తిసుధాస్వయంవరవేళ
మించి, కల్గునె సంతసించెడి వేళ ?

వింతవారలు లేని సంతోషవేళఁ
బరమరహస్య మాప్యాయనప్రదము ;
మనలో మనము చెప్పికొను మంతనంబు
శృంగారరింగదానంగరంగంబు.

సౌందర్యమహిమాతిశయము స్పష్టముగ,
మానసతత్త్వమర్మము ప్రస్ఫుటముగ,
కన్నది కన్నట్టు లున్న దున్నట్టు
లోకకథం జెప్పెద ; నూఁకొనవయ్య !

శ్రీ రస్తు

# స్నానఘట్టము

## ద్వితీయసోపానము

### రంగాభివర్ణనము

ధరణీవధూటికాభరణాయమాన
కాంచీపురప్రాంతకమ్రకాసార
రమ్యసికతాప్రదేశంబులందు
ని యొప్పుఁ బ్రకృతియౌవనలక్ష్మి వోలె ! 4

ండుటాకుల పేరి పట ముజ్జగించి
ంద్రాతపాంబుల స్నానం బొనర్చి
ుసుమచిత్రిత మైన కిసలచేలమ్ము
రియించి వనలక్ష్మి తనరారె నపుడు. 8

*   *   *   *   *

న మల్ల పాతాళవనమో యనంగ,
గనంబు పాతాళగగనమో యనఁగ,
ప్రవిమలజలములం బ్రతిఫలించెడిని;
ాని వైచిత్ర్యంబు వర్ణింప వశమె? 12

పాతాళవాసు లీవై పరుదెంచి
యగపడకుండ ఛాయాచిత్రపటము
నెత్తుచునున్నారొ యేమొ యన్పించె
సలిలతలోపరిసర్వంబు నీడ!

* * * * *

ప్రాగ్దిశ నరుణబింబ మలంకరించె;
దట్టమై మెఱయు ప్రాతస్సంధ్య రుచుల
ధర యెల్ల మేల్మిబంగరు నీరు వోసి
పూఁత పూసినయట్లు పొలుపొందఁజొచ్చె!

II

ఇనకరాలింగనజనిత మామోద
మించుక కను విచ్చు సంచునం దోఁప,
గిలిగింతలకుఁ గిలకిల నవ్వ నవ్వ
తన వికసన్ముఖస్థలిని నటింప,
అలినీసఖుల మేలుకొలుపుఁబాటలకు
మెచ్చుచు నాత్మఁ, బద్మిని మేలుకొనియె!
హంసదంపతుల విహారవిభ్రమము
చక్రవాకముల నిర్వక్రానురక్తి
యరసి మై మఱచిన కరణి, బకాళి
నిశ్చలంబుగ నీట నిల్చి యొప్పారె!

## II రంగాభివర్ణనము

ప్రియవియోగార్త, యివ్విధ మెల్లఁ గాంచి,
మూతి ముడుఁచుకొనె ముగ్ధ కైరవిణి! 32

* * * * *

తామరాకులలోని హైమకణాళి,
ఆకుపచ్చపసిండి* యచ్చు రేకులను
బొదివిన ముత్తియంబులు వోలె మెఱసి,
సౌందర్యసత్కావ్యసంపుటిలోని 36
రారాజదక్షరరససుధాబిందు
సందోహమట్టు లానందంబు గూర్చె!

* * * * *

ఏవంవిధమనోజ్ఞదృశ్యప్రబంధ
మా వినిర్మలనిశ్చలాంభస్తలంబు, 40
గట్టుల పేరింటి చట్టంబుతోడి
ప్రకృతిశోభాచిత్రపట మనఁ బొల్చె;
స్మరవైజయంతికాఝుషము లాత్మీయ
భాస్వర§కాంతులం బఱప, నీక్షించి 44
వనలక్ష్మి మన్మథవ్రతమంటపమున
పఱపించిన తివాసి వాసిఁ జెన్నారె!

---

* ఆకుపచ్చబంగారము వేంకటగిరిసంస్థానమునఁ గలదు.

§ భాస్వరము = ఫాస్ఫరసు.

III

వనసీమ నేచాయఁ గను విచ్చి కన్న,
వల్లికావృక్షదాంపత్యంబె తోఁచె!

వాగర్థదాంపత్యవైభవం బనఁగ
మాధురీక్షౌద్రదాంపత్యం బనంగ
వాసనాప్రసవదాంపత్యం బెసంగె;
భావదాంపత్యంబు భవ్యంబు గాదె?

పారావతంబు లపారానురాగ
భరితదాంపత్యప్రభావంబు దెలిపె,
తమ ప్రియయోగనాదబ్రహ్మతుల్య
కూజితంబులఁ, గళాకుశలత మెఱయ!

* * * * *

మలయానిలవరుండు మెలమెల్ల నూఁప,
నవలతాడోలలో నవసుమవధువు
వంపుల వంపు నవ్వుల యిం పొర్వ,
మేటి పుప్పొడి పేరి పైఁట జీరాడ,
కులుకుఁదళుకు లను కొల్కులు ద్రిప్పికొనుచు
నొయ్యార మొలయంగ నుయ్యాల లూఁగె!

మాధవి భావైకమాధురి మెఱయ,
పుష్పరాగంబు విస్ఫురితంబు గాఁగ,
చలదళాక్షుల నలుగెలఁకులుం జూచి
సురుచిపరాగకంచుక మోసరించి,
సరసప్రవాళహస్తంబులం జాఁచి
సహకారవల్లభు నందిటం బొదివి,
స్తబకస్తనాశ్లేషసౌఖ్యసంతోష
ముత్కటం బయి పయి కుబికెడి ననఁగ
తళుకునిగ్గుల పేరఁ గిలకిలన్ నవ్వి,
కిలికించితంబునం గెరలి యుప్పొంగె?

*　　*　　*　　*　　*

ఇట్టి వినోదంబు లితివృత్తములుగ
కలకంఠసుకవులు గానం బొనర్ప,
భ్రమరఝంకారమర్దలవాద్యగతుల
నిగిడి మయూరముల్ నృత్యం బొనర్చె!

పుష్పవిద్యుల్లతాస్ఫురణంబుతోడి
యంబరచుంబిశాఖాచ్ఛాదనంబు
రాజత్పయోధరభ్రమఁ గొల్పె నేమొ?
కాకున్న, నెమ్ము లీ గతి నటించెడినె?

సురుచిరం బగు పయోధరదర్శనమున,
నెమ్మలే కా, దాడు నిఖిలజగమ్ము!

*　　*　　*　　*　　*

సౌందర్యప్రీతిలోచనమానసముల
పెండ్లిపందిలివలె విలసిల్లె వనము!

IV

రంగమ్ము పంచశరప్రపంచమ్ము,
స్మరబలాభ్యుదయసుస్వరసంకులమ్ము,
దర్పకవిజయకేతనభాసురమ్ము,
శీతలప్రాభాతవాతపోతమ్ము;
లీలావిహారైకలోలయువమ్ము!
సమయమ్ము ఫలపుష్పదము వసంతమ్ము!

*　　*　　*　　*　　*

స్థలకాలపాత్రల బల మింత యుండ,
ఎవరిచే నేమి చేయింపఁడు మరుఁడు?
చంద్రబలం బొందు చాలమి నేమొ
ధ్వజ మెత్తఁడయ్యె నెవ్వరిమీఁద నపుడు!
అసహాయశూరుఁడే యైన, నే మగును?
గ్రహచారబల మలంఘ్యం బేరి కేని!

శ్రీరస్తు

# స్నానఘట్టము

## తృతీయసోపానము

### పాత్రప్రవేశము

చంద్రబలముఁ గూర్చి స్మరుని వినూత్న
విజయధ్వజంబులన్ వెలయింప ననఁగ,
లావణ్యవారాశిలలితభంగములఁ
జిఱునవ్వు వెన్నెలల్ మెఱసి నటింప
ఱెప్పల పొలసుల విప్పులం దొలఁకు
వీక్షణకాంతులు విరిసి చలింప,
కులుకులన్ బెళుకులన్ దళుకు లొలికించు
చంద్రాస్య మీనాక్షి చనుదెంచె నొకతె!

మన్మథవ్రతము సంభావించుచున్న
వనలక్ష్మి యాహ్వానమును గౌరవించి
తన్మహామహము సందర్శింపఁ గోరి
మహి కరుదెంచిన మధులక్ష్మి యనఁగ,

అయ్యనంగునితోడ నర్చన లంద
క్షితి కేఁగుదెంచిన రతిదేవి యనఁగ,
సమ్మోహనాకృతిన్ సౌందర్య మెల్ల
నవతరించిన రీతి యువతి విచ్చేసె!

* * * * *

పరిమళభావవిస్ఫురణంబుతోడ
సురుచిశుభ్రపరాగదరహాస మొలయ,
పల్లవహస్తంబు లల్లల్లఁ జాఁచి
యామామధ్వర్ఘ్యపాద్యంబు లర్పించి,
నవపనీరమ సుమనఃపూర్వకముగ
హర్షంబు వర్షించి, స్వాగతం బనిమె
శుకభాషణముల నిస్తులతోషణముల
మార్దవమాధురీమాధురీణముల!
భ్రమరభటోత్కర శ్రావ్యఝుంకార
సాహోనినాదముల్ చదలంటఁ బర్వె!

II

అతికుమారకు నైన నందంబు గూర్చి
జనదృగాకర్షణాశక్తి ఘటించు
యౌవనం బీ సకలాంగసుందరికి
అమితశోభ ఘటించు టది యబ్బురంబె?

త్రిదశనిర్జరశబ్దవ్యుత్తులం బట్టి,
యౌవనమే చూడ దేవత్వ మగును;
అయ్యదియే యమృతాహార మగును;
సౌందర్యసారస్యసర్వస్వ మదియె!

*  *  *  *  *

పరిమితానర్ఘభాస్వరమణిస్వర్ణ
దివ్యభూషణములు దేదీప్యమాన
విభవంబు నెల్లెడన్ వెదచల్లెఁ; గాని,
భూషణంబులకె విభూషణం బైన
యోష దేహంబు సంతోషంబు గూర్ప,
సహజసౌందర్యప్రసరణాంతరాయ
కారణంబు లటంచు గర్హింత్రె కాని,
భూషణంబులఁ గాంచి పొంగుదు రెవరు?

*  *  *  *  *

ప్రకృతిసౌందర్యంబు బహుగుణితముగ
దీపించుఁ జిత్రచిత్రిత మైన మాత్ర;
ఆ యింతి సౌందర్య మతివిచిత్రంబు,
అదె యలేఖ్యం బైన యసమచిత్రంబు!

## III

ఏకడనుండియో యెఱుఁగంగరాదు,
"ద్రష్టయున్ స్రష్టయున్ ధన్యు! లీ యంద
మద్భుతంబులలోని యద్భుతం!" బనెడి
కలకంఠమధురవాక్యము వినవచ్చె!

అతనుండె ముగ్ధుఁడై యటు లాడె నేమొ?
అదె మంత్రజప మయ్యె నందఱి కపుడు!
స్త్రీలె దిగ్భ్రమఁ జెంది ప్రేమించి రనఁగ,
పురుషుల గతి తానె స్ఫురియింపకున్నె?

* * * * *

సింహమయూరాదిసృష్టి నశేష
పురుషజాతికి మహాద్భుత మైన రూప
రేఖావిలాసముల్ హృదయంగమముగఁ
గూర్చిన యా బ్రహ్మకున్ మతి చెడెనె?
సర్వోత్తమం బని సన్నుతిం గన్న
మానవసృష్టిలో మాత్రం బ దేల
స్త్రీజాతి కటువంటి చెలు వెల్లఁ గూర్చి
పురుషజాతికి దైన్యమును గలిగించె?
మృగఖగాదులు తన కే మొరగించె?
మనుజులు త న్నేమి మన్నింపరైరి?

మరి, సురాసురసృష్టిఁ బరికించి చూడ,
పురుషజాతి యసహ్యముగఁ గానిపించు;
తలల చేతుల సంఖ్య తలఁచినంతటనె,
వింత వింత మృగంబు లంతంతఁ దోఁచు!
అది యసాధారణత్వాపేక్షవలని
మనుజుల రూపకల్పనయొ* సత్యంబా?
దీనికి హేతు వేదే నగుఁగాక,
స్రష్టపూజ్యతకుఁ బూజ్యత సంభవించె!

* * * * *

సౌందర్యమహిమాతిశయముతోపాటు,
పురుషసమ్మోహనాద్భుతయంత్రశక్తి
స్త్రీత్వమందే ప్రతిష్ఠిత మయి యుండు;
ఔ, వయఃకాంత యయఃకాంతశక్తి!

అధికారధనకీర్తు లన్నియుం గలసి
కలికి చందమున నాకర్షింపలేవు;
దీని రసాసవోద్రిక్తదృష్టులకు
విశ్వంబు సర్వంబు వెఱ్ఱెత్తి యాడు!

---

* వంగచిత్రకళాస్వభావంబు నేఁడుఁ
బూర్వకాలపు మట్టిబొమ్మలం బోలు!

## IV

స్పర్శనాదుల వేల? దర్శనమాత్ర,
సౌందరీనాయిక సకలప్రసన్న,
మహితమనస్సంగమాధురి మెఱయ,
రససుఖానందసర్వస్వంబుఁ గూర్చు!

*     *     *     *     *

ద్రష్టల ప్రీత్యాగధర్మంబు కొలఁది,
అతివ లజ్జావనతాస్య కాఁదొడఁగె;
వార లేసద్దర్శకుల మంది రనఁగ,
సౌందరీదేవీప్రసాదంబు గనిరి!

సి గ్గొకండు పరిత్యజించెడివాఁడు
ముల్లోకములు గెల్చు మొత్తంబుమీఁద!
అది యేమి వ్యసనమో? యనయంబు వార,
లనయం బనుకొనక వినయంబు నొడ్డి,
యొండొరులను గెల్వ నుంకించి మించి
జూద మాడినయట్లు చూచి రా సొగసు.

*     *     *     *     *

ఆత్మప్రశంసామహత్త్వమో యనఁగ,
బిబ్బోకవతి యుబ్బి తబ్బిబ్బయ్యె;
చక్కందనముతోడి సరసవిలాస
నటనమ్ము చంద మానందకందమ్ము!

శ్రీరస్తు

# స్నానఘట్టము

## చతుర్థసోపానము

### వస్త్రధావనము

హంసభామినులకు యానోపదేశ
మొనరింప నరుదెంచు నోజ యనంగ,
వనజగంధము మించి తనుగంధ మొలయ,
స్నానఘట్టముఁ జొచ్చె జవ్వని యంత.

మందాక్షమకరంద మందంద చింద
కెలఁకులం దిలకించి, తల యిట్టె వంచి
పురుషులు లేని వైపున కట్టె మరలి,
రైక యెడల్చి నీరంబులన్ ముంచి
తీర్థశిలం గొట్టి తెమలించి పట్టి
జాడించి పిడిచె నచ్చేడియమిన్న.

బిసకాండబాహువుల్ వసివాడు ననుచు,
కమలహస్తంబులు కమలెడి ననుచు,

కాంచనకాయంబు కందెడి ననుచు,
ఉండియు లేనట్టు లొప్పు కౌఁదీవ
యుబ్బుఁ దలకు సైఁప నోపదే యనుచు,
ద్రష్టలు జాలిమైఁ దహాతహా పడిరి!

బాహుమూలద్యుతుల్ పైపైకిఁ బ్రాఁక
లేమ కంచెల విదిలించుటం జూడ,
స్మరయశశ్చంద్రికల్ మలయంగ విజయ
కేతనం బెత్తిన రీతి స్ఫురించె!

*      *      *      *      *

కలికి పాలిండ్లు చొక్కపుఁ బూలచెండ్లు
ననవిల్తు కోట కెత్తిన పైఁడిగిండ్లు,
పరిపరి తెఱఁగులన్ మెఱఁగు లుప్పొంగ
నొండొంటిఁ ద్రోసికొం చుర మెల్లఁ గ్రమ్మి,
తమ్ము విజృంభణాతంకమ్ము గాఁగ
పట్టి బంధించిన చెట్ట కంచుకము
తగిన చందంబున దండింపఁబడుట
కానంద మంది లాస్యము సల్పె ననఁగ,
ఆడకయే యాడినట్టులు తోఁచి
చూపఱ నాడింపఁజొచ్చెఁ జోద్యముగ!

యౌవనవనకనల్లావణ్యసరసి
స్తనపద్మకోరకసౌరభం బొలయ,
పై వ్రాలి యెంతయుం బానం బొనర్చి
సౌందర్యమకరందసారాభిలాష
తీఱక యఱె నిల్చె నా రహి నించి,
జానయ్యెఁ జూచుకచంచరీకములు !

“వనములో వేఱొక్క వన ముద్భవించె,
సరసులో మఱియొక్క సర సుప్పతిల్లె;
ఇట్టి యద్భుతరంగ మిఁకఁ జిక్క !” దనుచు
తేఁటి పాటలకుఁ బద్మిని నాట్య మాడె!
“నాటకాంతర్భూతనాటకం !” బనుచు
సరసులు చూచి మెచ్చరె యిచ్చలందు?

II

తన కన్నుఁగవ మూసికొని పాలు ద్రావి
జను లది గాంచలే రని మదిన్ మురియు
మార్జాలముం బోని మానవోత్తములు,
నీతికోవిదు లయ్యు, నిజదంభ ముడిగి
యూదల లెత్త ఏకాగ్రతం బూని
యా లేమ సౌందర్య మపహరించుచునె,

యంతరంగము లందు నాప్యాయనంబు
బహిరంగ మగు నంచు భయ మొంది రనఁగ,
తత్తరింపఁదొడంగి రత్తరుణమున ;
పరిహాసపాత్రంబు వారి వృత్తంబు!

భావస్వభావంబు పరవిషయముల
నిర్మలతార్జవనియతిఁ దోఁచినను,
స్వప్రయోజనమునం బ్రసరించునంత
కుటిలత్వ మూని రంగులు బయల్పడఁగ
కలుషాపు చూపు, పల్కులగాజులోన
ప్రసరించు విమలప్రభారేఖ వోలె!

* * * * *

దృక్ప్రీతసౌందర్యదివ్యాసవంబు
మహానుల నైన నున్మత్తులం జేయు!

ఆసవంబు వధూవిలాసంబుఁ దుల్య
గుణజనకములె కా కోవిదోక్తులను ?
వలవక యే యింత వలపించు శక్తి
యీ రెంటిలోఁ దక్క నిం కెందుఁ గలదు ?

* * * * *

వృద్ధన కేని నయ్యింతిఁ గన్నంత
రమయౌవనపాటవము కల్గఁజొచ్చె.

సంపూర్ణయౌవనసంఫుల్లగాత్ర
నవవిలాసామోదనటనసంపన్న
సౌందర్యమంజరి స్మరసమస్తాస్త్ర
పుష్పసంఘీభావమోహనశక్తి,
కల్పకంబట్లు, సంకల్పమాత్రమున
సమకూర్పరాని యాశ్చర్యఫలంబు
భావలోకమున సంభవము కాఁగలదె?
రసగుళికను మించి రససిద్ధి యున్నె?

III

నవ్యవిశ్వవిలాసనాట్యరంగమున
దృశ్యేక్షణోత్కంఠఁ బ్రేరేచుకొఱకు
స్మరసూత్రధారుండు సవరించినట్టి
యవనిక చందాన నలరారు చీర,
సౌందర్యఘన మెల్ల జాఱిపోకుండ
మూటగట్టిన మంచి నీటైన చీర,
"కొంగు తాఁకినఁ జాలు, కొం డెక్కి పోదు"
మనిపించి యలరించి యాడించు చీర,
గాలి సోఁకిన మాత్రఁ గలవరంపఱచి
చూపఱ నుయ్యాల లూఁపెడి చీర,

ఈ చెల్వ చెల్మిమై నింత శోభింప
నెన్ని నోములు నోఁచుకొన్నదో చీర ! —
అని యభివర్ణించి యా చీర సొగసు,
బేలుపోయిరి ద్రష్ట లేలొకో యపుడు?

తా జరీ పట్టు వస్త్రమ యగుంగాక,
ఈ వర్ణనీయమహావైభవంబు
దాని గుణము గాదు; స్థానగుణమ్ము!
కట్టు చందమ్మునం గల్గిన గుణము!

*    *    *    *    *

వీక్షించునంత నే మోక్షంబు గూర్చు
నీవి మోక్షం బెంతొ నిపుణతం జేసి,
యొక కొంగు చుట్టి వేఱొక కొంగు పట్టి
యుతుకంగఁ జొచ్చె నయ్యువతిరత్నంబు!

మదనసామ్రాజ్యరమావైభవమును
సూచించు రేఖామరీచివీచికలు
మెఱుపుఁదీవెలు వోలె మెఱసి, ప్రేక్షకుల
మిసిమిసి చూడ్కులన్ మిఱుమిట్లు గొల్పి,
మఱిమఱి వీక్షించు మక్కువతోడ
స్తంభింపఁజేసె నాశ్చర్యంబు గాఁగ!

*    *    *    *    *

లీల సౌందర్యాబ్ధి నోలలాడుటయొ?
యౌవనమాధుర్య మాస్వాదించుటయొ?
తరళలావణ్యామృతంబు గ్రోలుటయొ
యౌగికానందంబు ననుభవించుటయొ?
వారి యా దృష్టుల భావం బ దేమొ,
వారే యెఱుంగ; రెవ్వరు చెప్పఁగలరు?

* * * * *

ఇవ్వాలకం బెల్ల నవ్వాలుఁగంటి
యెడనెడ నీక్షించి యీక్షింపనట్ల,
అప్పళించుచు సిగ్గు ఱెప్పల తుదల,
మొలకెత్తు చిఱునవ్వు సెలవుల నాఁచి,
నయభయశంకాభినయగతుల్ మెఱయ
కుంచితగాత్రి యై కొలుకులం ద్రిప్పి,
తలిరుల జొంపంబుఁ దలఁపించి మించి
తడఁబడు మునివ్రేళ్లఁ దత్తరం బెనయ,
సింగారమున కంగు చేల చెఱంగు
సవరించుకొనియెఁ; దత్సౌభాగ్యశోభ
దర్శించిన యతండె ధన్యోత్తముండు!
ఆతని జన్మంబె యన్వర్థకంబు!

## IV

దాఁచెడి వస్తువుం జూచెడి కోర్కి
దౌర్లభ్యము కొలందిఁ దనియించుచుండు;
ప్రత్యనుభూతుల ప్రమదమున్ మించి
యుద్యమానందంబు హృద్యమై తోఁచు

జంకుగొంకులతోడి సమరంబు నడుమ
తొంగలిచూడ్కులన్ దొంగిలునపుడె
దర్శనం బానందదాయకం బగును;
దోబూచులం బోలెఁ దోఁచెడియపుడె
ఇంచుకించుక యనిపించెడియపుడె
ఆనందదాయకం బగు దర్శనంబు!

అరయ, నైరంతర్యమందుఁ బూర్ణత్వ
మం దది యంత యానంద మీలేదు.

శ్రీరస్తు

# స్నానఘట్టము

## పంచమసోపానము

### స్నానము

చిత్తజోద్వృత్తికి సిగ్గు లేదు,
నీతి వివేకంబు నిలుకడ లేదు;
వైరబీజము సంప్రహారకారణము
స్త్రీ చక్కఁదనమె చారిత్రంబు చూడ!

తన రూపు తా నద్దమున విలోకించి
తనుఁ దాన మోహించుకొను నందగత్తె
మన కథానాయిక, మన్మథోన్మత్త
యువదృష్టులకు భయం బొందు టబ్బురమె?

* * * * *

ఆసేచనకము లౌ స్వాంగకంబులకు
దృష్టిదోషం బుప్పతిలు నన్న భీతిఁ
దన మేను దాఁచికోఁ జనెనో యనంగ,
నీటిలోనికి డిగ్గె నీరేజనేత్ర!

చలిచేతఁ గలుగు నూర్పులు బుసల్ గాఁగ
కంపనం బది వక్రగమనంబు గాఁగ
ఉబికెడి వసనంబు కుబుసంబు గాఁగ,
తల బైటికిం బెట్టి కలుఁగులోఁ దూఁటు
తరుణభుజంగినిం దలఁపించు భంగి
సలిలంబులం జొచ్చె నల కంబుకంఠి!

* * * * *

వేణికాశైవాలవీక్షణపత్ర
రమణీయ మై, సరఃకమలంబులందుఁ
దా వింత కమల మై, తరుణి నెమ్మోము
అతిదర్శనీయత నలరారె నపుడు!

అంభస్తలము పేరి యంబరంబందు
తామరసవ్యాజతారాళి నడుమ
తేజరిల్లెడి సుగాత్రీసుందరాస్య
సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబు
దరహాసకౌముదిం దనివి తీఱంగ
దృక్చకోరముల కాతిథ్యంబు గూర్చె!

II

ఉచ్ఛ్వాసఝుంకార ముచ్ఛృంఖలముగ,
చూపఱ మూఁకల రూపునం దనరు

గండుతుమ్మెద పిండు దండుగాఁ బర్వి,
ముఖపద్మమకరందమును గొల్లగొట్టి
కనుగల్వ పూఁదేనెలను జూఱలాడి
అధరబింబరసంబు నానం దొడంగె!

శ్రవణాంగకము నేమి నవపుష్ప మనుచు
భ్రమసెనో కాని, యా భ్రమరంబు లోలసి
"రెండు ప్రక్కల నవశ్రీలే!" యటంచు,
నవనవగతుల నానంజొచ్చె మధువు!
నవగుణితం బె ట్లైనను, మొత్తమునకు
నవత నే చూపుఁగా నవగణితమున?

ముద్దుల మురిపాల మూటలం బోలు
చెక్కుటద్దాల సుస్నిగ్ధభాగముల
ముచ్చటగాఁ జేరి ముద్దాడి మురిసి,
అలసట దీర్చుకో నట విశ్రమింప—
కవిసమయంబు భగ్నము సేయ ననఁగ,
సర్వసౌరభము నాసాచంపకమును
విందు చేకూర్చె నా భృంగసంతతికి!

* * * * *

ఈ వింత చవులకు నెంతయున్ మరగి,

బొమవిలు వంచి చూపుందూపు లేసి
తఱిమినం, బోవయ్యెఁ దరలి యా యళులు!

ఈ చూపు లా చూపు లో చాయఁ గలయ
పళపళ నొక జ్యోతి ప్రభవించె నడుమ,
ద్వివిధవైద్యుతశక్తు లవి చేరికొనఁగ
తేజరిల్లు మెఱుంగుఁదీవ చందమున!

III

ఎంత సేపటికిఁ ద న్నెడసిపోకున్న
యువలకుం గాన్పింపకుండ నుంకించి
కాఁబోలు, పలుమాఱు లా బోటిమేటి,
ద్రవదహింభీతిమై రాజార్భకుండు
తన తండ్రి కడుపులో దాఁకొను రీతి,
శిర మెల్లఁ దత్సరోవరమునన్ ముంచి
కాల మించించుక కడపందొడంగె;
అనువు గానపుడు దాఁకొనుటె కార్యంబు!

వెఱపుమైఁ జొచ్చిన వివరంబునుండి
తన భావగతి మెఱుంగను సారెసారె
తల వెడలంబెట్టి తిలకించునట్టి
భోగినియుం బోలె, పూఁబోఁణి యొప్పె!

*   *   *   *   *

వెలఁది నీట మునుంగు కొలఁదిఁ జూపఱకు
విదితవికారంబు లుదయించె; హృదయ
కమలముల్ తమ ఘనత్వము గోలుపోయి,
నీ రయి యటు కూడ నిలువంగలేక,
బాష్పకైతవముతో బైటికిం దోఁచె;
కామాగ్ని మహిమంబు గనఁ దరం బగునె?

దానిఁ జల్లార్చు నుద్యమమో యనంగ,
పరమసానుక్రోశపారవశ్యమున
నలుపు శుభస్నానసౌభాగ్య మనఁగ,
నీ రయ్యె నిలు వెల్ల వారి గాత్రములు.

* * * * *

ఒక్కొక్క మున్కకు — నొక్కొక్క జనుఁడు,
కౌతుకపాశాంతకలిత మై నిగుడు
చూడ్కిగాలము వైచి శోధించుకొనుచు,
ముల్లె మున్గినయట్లు పెల్లు శోకించె;
ఉదకంబుతోపాటు హృదయదృష్టులును
సుడివడి మిగుల సంక్షోభింపఁజొచ్చె!

గ్లాని యాస్యముల రూపూని నటింప,
నిశ్చేష్టులై వారు నిల్చి రొక్కింత!

బయ లంధకారసంబాధ మైనట్లు
ధర శూన్య మైనట్లు స్ఫురియించు టరుదె?

IV

వలపుందలంపుల వగపులయెడల,
జీవకారుణ్యంబు సిద్ధించు మిగుల;
ఏ వితర్కము లేక యే, విషాదమున
ధృతిగర్వబలము దూరీకృతం బగును;
ఉన్మాద ముదయించి యుత్కటం బైన,
ఔచిత్యము తనంత నంతరించెడిని;
దైన్యప్రభావంబు తలయెత్తు కొలఁది,
ఔత్సుక్య మావేశ మతిశయించెడిని;
అది యేమి మోహమో, యా శిరస్స్నాన
మాత్మహత్యాయత్న మటు వారి కయ్యె!
ఆ లేని నిబిడీకృతాంధకారమున
ఆ యున్న సర్వశూన్యాంతరాళమున
దిక్కు గానక, వార లక్కులో మెలఁగు
మనమును వశవర్తి యని విశ్వసించి
"ఆత్మహత్యను మాన్పి, యరుదె!" మ్మటంచు
సరససందేశ మంపిరి యిం పెలర్ప!

* * * * *

రసికావతంసమానసహంస మపుడు,
లావణ్యజలములన్ లంఘించి యీఁది
కలవిలాసోర్మిలన్ నిలువీఁత లీఁది,
వలపుల లోవెల్లువలు లోని కీడ్వ,
పారంబు గనలేక సారసౌందర్య
సరసి మున్గెనో యేమొ, మరలిరా దయ్యె!

స్వామికార్యార్థంబు ప్రాణ మర్పించి,
ఆ రాయబారి కృతార్థుఁ డైపోయె;
సౌందర్యదేవతాసాయుజ్య మంది,
మురిసి బ్రహ్మానందమూర్తి యైయుండు!

* * * * *

అతని స్వామిద్రోహి యనిరి వా రెల్ల;
అహహా! మన్మథకాలమహిమ నే మందు?
కలహంపుఁ దార్మాటుగాఁ జూపు మరుఁడు;
మోహంబు కేవలాపోహజన్యంబు!
వారి యసూయ భావజ మైన మాయ;
కాముకసేవ యిక్కట్టుల క్రోవ!

V

ఇంగితభ్రూభంగ మింద్రాయుధమ్ము,
తీవ్రదృష్టి యొఱపు తెండ్రించు మెఱపు,

స్నానఘట్టము

దూషణప్రసరమ్ము తుల లేని యుఱుము,
వారి యమర్షంబు వారివర్షంబు!

ఆ మేఘమే లేని యతివృష్టియందు
అశనిపాతధ్వని యాలించి రేమొ? 124
వడవడ వడఁకుచున్, జడి గొట్టి యట్టె
నిల్చినట్టులు, వారు నిశ్చేష్టు లైరి!

* * * * *

"నమ్మిన బంటె యన్యాయం బొనర్చె!
వల్లభ దుర్లభ; వల పింక సలుపు!" 128
అని యభావవిరక్తి నందిరో యనఁగ
నిమిషంబులో వారు నిర్విణ్ణు లైరి!

వాన ముందటి యుక్క వంటి ది దెల్ల;
ఆనంద సోపాన మగు నింకమీఁద! 132

బహుళపక్షార్తి తర్వాతఁ బ్రాప్తించు
శుక్లపక్షముదంబు సొంపు దీపింప,
కష్టంబు వెనువెంటఁ గలుగు సౌఖ్యంబ
అత్యంతభోగ్య మై యానంద మొసఁగు! 136

శ్రీ రస్తు

# స్నానఘట్టము

## షష్ఠసోపానము

### ఉత్తరణము

సదసత్సురాసురసంఘముల్ దివిరి
కోనేటి పేరి పాథోనిధిం బట్టి
ఆకాశమందరాహార్యవర్యమున
దృగ్వాసుకినిబద్ధవృత్తి మథింప —
కచకాలకూటవికచరోచు లొలయ
ఆననచంద్రస్తనామృతకలశ
సౌదర్యశోభాప్రసారంబు మెఱయ —
చేలబుద్బుదసరసీజపీఠమున
పుట్టిన లక్ష్మి యంబుజపాణి యనఁగ,
ఆ భామ పురుషోత్తమానందధామ
శృంగారనాయిక, చిఱునవ్వు లొలుక,
మొలబంటి నీటిలోపల నిల్చి పొల్చె.

సకలజగత్సమాశ్రయణీయ రమణి
కేవలశ్రీ యని కీర్తింపఁ దగదె ?

* * * * *

*"ఇందుఁ డీ వేళఁ ద న్నెదిరి మార్కొనిన
రాహువుం ద్రోచి, కరములఁ బీడించి
కీలాల మెడలి నల్కొలఁకులం బాఱ,
బంధించి తన వెన్కఁ బడవైచె; నిట్టి
వింతను గనలేదు వినలే!" దనుచు
ద్రష్ట లాశ్చర్యనిర్మగ్ను లై రపుడు.

II

సరసీవినీలాంబుధరవినిర్ముక్త
విద్యుల్లత స్థిరీభవించి చోద్యముగ
నడయాడు చందమ్మునం దనరారె
తరుణీమణీసముత్తరణంపు హేల !

* * * * *

సరసభక్తికి మెచ్చి సాక్షాత్కరించి
అనిమిషత్వవరంబు నడుగకే యిచ్చి

---

* ఇది శ్లేషానుప్రాణిత మైన రూపకాతిశయోక్తి. నాయిక మోమునం బడిన ముంగురు లెగఁద్రోసికొని, నీళ్లు పిడిచి జుట్టు ముడుచుకొనె నని భావము.

ఎంతటి యార్తునకే నెటు గన్న
నత్యంతసంతోష మంతంతఁ గూర్చు
దివ్యసౌందర్యాధిదేవత యనఁగ,
ఆ రామ ద్రష్ట్రమనోరథారూఢ
దృష్టిపాశవిశేషదృఢసమాకృష్ట
తీరాభిముఖగ నేతేరం దొడంగె.

అమలతటాకామృతావగాహమున
శర్వాని ఫాలాగ్నిఁ జల్లార్చుకొనిన
యతనుండు దిగ్విజయార్థంబు తనదు
పంచాయుధములకుం బద నిడి వాని
నేకాకృతిం దీర్చి యేసెనో యనఁగ,
అడుగడుగున కెక్కుడైన యాత్మీయ
గంధప్రభాతరంగము లీఁదుకొనుచు,
తటమునకుం జేరెఁ దరళాయతాక్షి.

* * * * *

తడిసిన జిలుఁగు వస్త్రం బద్దమట్లు
నిజరూపరేఖల నిలువునం జూప,
సడలిన చేలంబు సవరించుకొనుచు
నిలుచుండిన వధూటి నిర్నిద్రశోభ

వర్ణనాతీత ; మప్పట్టున ద్విజులు
సౌందర్యసాగరస్నానం బొనర్చి,
విధి విరామము లేక, సుధ యని యేమొ?
యాచమింపఁదొడంగి రందే కడంగి! 48

III

భూగర్భమధ్యమాద్భుతమహాశక్తి
స్థావరజంగమాత్మకసమస్తంబుఁ
దన వైపునకు నీడ్చుకొను చాడ్పు దోఁప,
తనుమధ్యవిశ్వమోహనమహాశక్తి 52
దృష్టులతోపాటు ద్రష్టృచిత్తములఁ
గడు వడిమై సమాకర్షించుకొనియె.

మరి, యయస్కాంతసంభరితసూచికలు
దక్షిణోత్తరముల దర్శించు రీతి, 56
చొక్కిపోయిన వారి చూడ్కు లా చేడె
క్రిందుమీఁదులు విలోకింపం దొడంగె.

* * * * *

లోచనంబుల పేరి కాచగోళములఁ
బ్రతిబింబితం బయి వర్ధిల్లి, హృదయ 60

ఫలకముద్రిత మయి, భాస్వద్విశాల
భావపటంబులం బరివృత్తిఁ గాంచి,
జీవకళాస్ఫూర్తిఁ జెలఁగు సౌందర్య
మూర్తి చిత్రములు సంకీర్తనీయములు!

IV

భానుబింబవ్యాజవైద్యుతైకాగ్ర
మహితదీపప్రభామండలి నడుమ,
వలువ రూపుం గొన్న వలతెరనుండి
తటరంగమున బోటి నటివోలెఁ బొల్చె!

* * * * *

కీరరాజసజీవతోరణరమ్య
వనమంటపమున భాస్వరతీరవేది,
శాఖాద్విజోత్తమశ్రావ్యనాదములు
మంత్రతంత్రంబుల మహిమంబు గూర్ప,
మన్మథవ్రతము సంభావించినట్లు
రాజాస్య రసికవిప్రవరుల కెల్ల
జలకణమౌక్తికంబుల ధారతోడ
సౌందర్యవాయనశతము లీఁజొచ్చె.

* * * * *

పిడిచిన పైఁటతోఁ దడి యొత్తివైచి
చెఱఁగు మార్చుకొనెడి చేడియ మేను,
మన్మథవేదార్థమహిమంబు దెలుపు
మొగిలి పూరేకుల పొత్తంబు వోలె,
ఆ నాదబిందుకళాతీతశక్తి
రూప మించించుక చూపెఁ జూపఱకు.

* * * * *

చూడకే క్రేగంటఁ జూచిన ట్లయ్యె,
నవ్వకే సెలవుల నవ్విన ట్లయ్యె,
పలుకకే వీణియ పలికిన ట్లయ్యె,
ఆడకే మైఁదీవ యాడిన ట్లయ్యె,
పాడకే ప్రియగీతి పాడిన ట్లయ్యె,
కురియకే యమృతంబు గురిసిన ట్లయ్యె;
ఆ సుందరాంగి విలాసవిభ్రమమె
ద్రష్టల తన్మయత్వమున క ట్లయ్యె.
వారి యానందంబు బహుగభీరంబు;
లేఖిని కందని లీలం దనర్చె.
అది సత్యమో, యసత్యమొ? మానసికము
అనుభవంబె ప్రధాన మానందమునకు.

ఆనందమునకె కా, దఖిలభావముల
కీ యనుభూతులే హేతుభూతములు;
భూతార్థమున భేదమే తోఁపరాదు,
రెం డనుభూతులు స్మృతిమాత్రగతులు.
కుండలినీయోగగుప్తార్థ మెల్ల
ప్రేమయోగమునను బెంపొందుచుండు.
ఇందుఁ బ్రవృత్తియు నందు నివృత్తి —
పథములు వే; రైనఁ, బ్రాప్తి యొక్కటియె.

V

మైనంపుబొమ్మను బోని యా మేన
నాట్యకళానిపుణత్వంబు మెఱయ,
బిబ్బోకవతి నీట బిందె ముంపఁగనె —
పాదసేవ ఘటించె భూదేవి యటను;
వారిదేవత సుడివడి తత్తఱించె;
అంబరం బార్తనాదంబు నిగిడ్చె;
వాయుదేవుఁడు వెలువడి పర్వఁజొచ్చె;
అగ్ని మిత్రాభావుఁ డరిమధ్యమందు
నిలువంగఁ జోటు లే కలజడివడుచు,
ఆనంగగతిఁ బలాయన మాచరించి

కుమిలెను ద్రష్ట్రహృత్కుహరాంతరముల
పంచభూతంబులే భయపడినట్లు
వర్తించుచుండంగ, వామలోచనకు
లోఁబడకుండఁజాలునె యెవండేని ?

* * * * *

అవిక మొలం జెక్కి రజతపాత్రమును
నీరపూర్ణమును పాణిం బట్టి యెత్తి
నిలుచుండిన వధూటి నీటు పాటింప,
ప్రాఁత బాణంబులు పనికిరా వనుచు
బాఁకున్ గదయుఁ బూని వలరాచ జెట్టి
దిగ్విజయార్థంబు తెరలిన ట్లయ్యె!

* * * * *

పరమేంద్రియానందవైద్యుతశక్తి
క్రిక్కిఱియంగ, శరీరయంత్రములు
భరియింపలే వని భావించి, శక్తి
బాహిరగతికి దర్పకయాంత్రికుండు
వడివడి బిస త్రిప్పి పై కెత్తినట్టి
సూచికాగ్రస్ఫూర్తి స్ఫురియించి మించ,
రోమహర్షణము నిర్యుక్తకర్షణము
కంపపూర్వకముగాఁ గలిగెఁ జూపఱకు.

శ్రీరస్తు

# స్నానఘట్టము

## సప్తమసోపానము

### నిష్క్రమణము

ఒకబాహువల్లితో నుదకకుంభంబు
తళ్కుబెళ్కు లెలర్పఁ గుల్కుచు నదిమి,
మఱియొక వంకఁ దామరప్రూలగుత్తి
శృంగార మొలయంగఁ గెంగేలఁ బట్టి,
ఆ రెంటి పరిమళతారతమ్యంపుఁ
బోణిమిం జూడ నాఘ్రాణించుకొనుచు,
స్తనభరంబును మఱి జఘనభారంబు
నసియాడు కౌఁదీవ నట్టిట్టులూఁప,
నడకకుం దాళమానంబులు గాఁగ
పెనఁగొను తడి చీర పెళపెళలాడ
బిందెలోపలి నీరు చింది చిందాడ
ద్రష్టల గుండియల్ దడదడలాడ,

ఒయ్యార మెల్ల రూపూనిన భంగి
నెలఁతలమిన్న యింటికి బయల్దేఱె.

*    *    *    *    *

తరళాయతాక్షి మధ్యం బాకసంబు,
కవిసమయంబు నిక్కంబ; యన్యోన్య
మీడ్చుచుం ద్రోయుచు నెట్టుఁ బోనీక
యంతరాళమున గ్రహాదిగోళముల
నిలిపెడి శక్తియే, నిలిపెఁ గావలయు
వక్షోరుహానితంబవలయంబు లచట.

నడయాడునప్పుడు నడుమె యందంబు,
చక్కందనముఁ గూర్చు సర్వాంగములకు!

*    *    *    *    *

సౌందర్యసౌష్ఠవసౌకుమార్యములు
భాసురలీలావిలాసవిభ్రమము —
లిది యది యన నేల? మదిని గరంచు
నతిమధురం బైన యాకార మెల్ల —
ఏవంకఁ గనుఁగొన్నఁ, బ్రేక్షకాక్షులకు
అమృతాంజనం బయి యానంద మొసఁగె.

## II

కామసామ్రాజ్యసంగ్రహము మోహముగ,
"ఇఁక దక్కు, దిఁకఁ జిక్కు; దిదె యద!" యనుచు
లోభమంత్రాంగంబు లాభం బటంచు
ద్రష్టృనాయకులు ప్రోత్సాహం బొనర్ప —
క్రోధయోధుండు ప్రకోపించి మించి
మత్సరం బను పేరి మావంతుతోడ
మదగజం బెక్కు, యమృతకాశినిని
బల్మిమైఁ బట్టి తేఁ బర్వెడెం; గాని
తోడ్తో వివేకమిత్రుని హెచ్చరికల
వారి సంరంభంబు వారింపఁబడియె.

* * * * *

రాజ్యనిర్మాణమార్గంబు గ్రహించి
కాఁబోలు? నపుడు ప్రేక్షకనికాయంబు,
కామాంధకారంబు గాఢ మై పర్వ,
దృక్ఖనిత్రంబులం దెమలించి మెత్తి
సౌందర్యధనవిశేషము తస్కరించి
కనుదిడ్డుల నెడందగాదెలం బోసి
దాఁచికోఁజొచ్చె; నెంతయు నద్భుతంబు,
గాదెలు నిండ పెక్కడి ధనంబునకు!

ఆహారమునఁ దృప్తి యగు నింతలోన ;
అపహారమునఁ దృప్తి యగునె యెంతకును ?

## III

అమృతంబు వడ్డింప నల్ల నేతెంచు
మోహిని యని భ్రాంతి పొందిరో యనఁగ ,
దూరాన నుండియే తొంగి కన్గొనుచు
నప్రయత్నంబుగా నట్టె ప్రేక్షకులు
చేతు లొడ్డిరి ; గాని చెల్వ యించుకయు
క న్నెత్తి వారలఁ గననైనఁ గనక ,
లజ్జాభయాదికలలితశృంగార
లాస్యదర్పణమంజులాస్యంబు వాంచి ,
వెలిమబ్బులోఁ దూఱు నెలవంక వోలె
ముసిముసి నగవుల ముసుఁగులో డాఁగి ,
తక్కుచుం దాఱుచుం దబ్బిబ్బు లగుచు
మెలమెల్ల రంగంబు తొలఁగి పోఁజొచ్చె .

* * * * *

చంద్రబింబాభావసమయానఁ బోలె
కనులకు లేని చీఁకటి గ్రమ్మఁదొడఁగె .

## IV

నవరసోల్లాసమన్మథనాటకమున
శృంగారవిలయాంకరంగంబు దోఁచె:
కామంపుఁ బేరి నిక్కాఁక జీర్ణించి,
మోహజ్వరంబుగా ముమ్మరం బయ్యె.

ఆ వ్యాధిపరిణామ మాశ్చర్యకరము!
అలసత చపలత — యంతతోఁ బోక —
మతి విబోధంబును స్మృతి సమావేగ
మున్మాదసన్నిపాతోగ్రతల్ చూపె.

మేర మీఱిన యపస్మారభారమున
శ్రమ ముత్కటం బయి జడత ఘటింప,
మ్రాన్పడిన ట్లయి మ్రాఁగన్ను వెట్టి
సుప్తి గాంచిరి వారు; సుఖలయం బదియె.

* * * * *

స్మరభిషఙ్మణి చికిత్సం జేసి పోలె,
ఆ యవస్థాంతరం బంతలోఁ దీఱె.

అంతరంగము స్వస్థ మై, వారొకింత
కను విచ్చినంత, రంగమె మాఱిపోయె.

V

చిన్న దై చిన్న దై, చిన్నారి రూపు
చివర కదృశ్య మై చిక్కకే పోయె;
ద్రష్టృచిత్తములు నత్తఱిఁ జిన్నపోయి
లేమ రూపమునందు లీన మైపోయె.

* * * * *

కదలరు మెదలరక్కడనె యున్నారు,
పోయివచ్చినయట్టి పోఁడి గన్నారు;
అంతె కా, దా చేడియను బట్టి తెచ్చి
యాత్మలో దాఁచుకొన్నట్టు లైనారు.

స్మరవిజయం బని మది నెంచి రేమొ?
వారి హర్షము సుధావర్షధర్షమ్ము!

* * * * *

ముగ్ధ లై రాగవైదగ్ధిమై వారు
కౌతుకస్నానంబు గావించి మించి,
స్నేహపూరిత మైన చిత్తంపుఁ బ్రమిదఁ
గామాగ్నిదీపంబు కడుఁ బ్రజ్వలింప,
తమయంద యావాహనము గన్న మూర్తి
ధ్యానించి భావాసనాసీనఁ జేసి —

ఎంత వీక్షించినన్ సంతృప్తి గనని
నిడు వాలుఁజూపుల నీరాజనంబు,
ఉడికెడి హృదయంబునుండి వెల్వడెడి
వేఁడి నిట్టూర్పులతోడ ధూపంబు,
కార్యనిశ్చయబుద్ధిఁ గనకున్కిఁ గల్గు
తడఁబాటుతోడ నృత్యము ప్రదక్షిణము,
తలపోసి తత్పరత్వంబున సలుపు
మౌన స్తవంబున మంత్రపుష్పంబు,
తల వంచు తన్మయత్వంబున మించు
కన్నుమోడ్పుల నమస్కారకార్యంబు,
లలితంబులైన పండ్లను ముందు పెట్టు
దైన్యహాసమున నాత్మనివేదనంబు
మున్నగు నుపచారముల నెల్లఁ గూర్చి,
సౌందర్యదేవతార్చన చేసి చేసి —
తక్కిన ముక్తులం దడవంగ నేల?
సాయుజ్య మంది రా క్షణములోపలనె!

* * * * *

" మన్మథశ్రుతిని జీవన్ముక్తి యిదియె!
యిదియె బ్రహ్మానంద! మిదె భక్తిఫలము!

ఇదె జన్మసాఫల్య! మిదె సర్వ!" మనుచు
నంబరవాణి తా నట్టె ఘోషించె!

[1]జంగమకల్పవల్లిం గన్న మాత్ర
సకలవాంఛాఫలసంసిద్ధి గాదె? 116
[2]పార్వణచంద్రబింబముఁ జూచినంత
నలవడదే యమృతాంధస్త్వగరిమ?
[3]నంచలన్మీనదర్శనమహిమంబ
మదనసామ్రాజ్యరమావైభవంబు! 120
[4]సూక్ష్మవిద్యుల్లతాస్ఫురణవీక్షణము
సాక్షాత్కృతబ్రహ్మసాయుజ్యపదము!

## ఫలశ్రుతి

ప్రకృతిపురాణసంగ్రథిత మీ గాథ;
ఇది చదివిన విన్నఁ దుదకుఁ జేకొన్న, 124
నిహమందుఁ బరమందు నహరహ, మందుఁ
బూరుషుం డల యజ్ఞపుణ్యఫలంబు! 126

---

1 మేను, 2 మోము, 3 కన్నులు, 4 చూపులు; రూపకాతి
శయోక్తి యలంకారము.

శ్రీ రస్తు

# స్నానఘట్టము

## అష్టమసోపానము

### నివేదనము

సర్వకారణశక్తి చైతన్యశక్తి;
సర్గంబ దాని నిసర్గధర్మంబు.
అది యదృశ్యస్థితిం బొదలెడునపుడు
అపకర్షణాకర్షణాకృతుల్ దాల్చు;
అదియె దృశ్యస్థితిం బొదలెడునపుడు
స్త్రీపురుషాత్మకాకృతులు వహించు.
ద్వైతంబులోని యద్వైత మీ శక్తి;
ఇంక విశిష్టాద్వైతమే దీని సృష్టి.

*　　*　　*　　*　　*

అపకర్షణాకర్షణాత్మకాదృశ్య
శక్తియోగజము విశ్వంబు గానోపు;
దృశ్యచైతన్యశక్తిని బరీక్షింప,
స్త్రీపురుషైక్యంబ సృష్టిమార్గంబు.

II

పరిణయనియమ మేర్పడని యానాఁటి
సృష్టిక్రమముఁ గూర్చి చింతింప నేల ?
ప్రకృతిధర్మము లితరప్రాణికోటి
పాటించిన, నరుండు పాటింపలేదు.

గర్భిణీభోగాదికంబు ల టుండ,
ఋశ్యశృంగాదుల సృష్టి చిత్రంబు !

* * * * *

అద్భుతం బగు సృష్టి యందందుఁ గలదు:
ఇటు కర్ణుఁ డటు క్రీస్తు నిం కెవ్వ రెవరొ
జనయితల్ లేకయే జనియించి రంద్రు ;
మరి, యయోనిజులుం గలరు పురాణముల.

ఏటికిం గొండకు నెట్లు పుట్టినదొ
యా గిరికాదేవి, యా దేవుఁ డెఱుఁగు !

* * * * *

నాగరకజగంబునం బరికింప,
బహుభార్యలం గొను పద్ధతి గలదు ;
బహుభర్తలం గొన్నవారలు లేరు,
పంచకన్యలలోని పాంచాలి దక్క.

అల * త్రివిష్టపమునం దద భర్తృ మంట ;
ప్రాఁకెన పెండ్లి యార్యావర్తమునకు ?
*     *     *     *     *
పెండ్లి నియమంబును భిన్నమతంబు :
అన్నదమ్ముల బిడ్డ లాల్మగ లగుట
యెడ నేగతిఁ గన్నఁ గూడదు ; గాని
సమ్మతం బగును మహమ్మదీయులకు .
జనకు నాంద్రం బంచుకొనెడి యేర్పాటు
వారి ఖురానులో వర్జింపఁబడియె .
*     *     *     *     *
భారతంబున నాదిపర్వంబులోని
వైవాహికాచారపద్ధతుల్ చూడ ,
ఎవ్వాని యిల్లాలి నే ' నొక్క కొడుకుఁ
గనిపెట్టు ' మని కోరఁజను బాహిరముగ .
దశవిధపుత్రతత్త్వము పరీక్షింప ,
పరిణయనియమలోపము కానవచ్చు .
*     *     *     *     *
తండ్రి చేఁ ద్రావించి ద్రాక్షాసవంబు
తనయులు మత్తు నాతనిఁ గూడి కన్న

---

* టిబెట్టున కిది యిప్పటి పేరు .

కొమరు లిర్వురును జేర్కొనఁబడినారు
వంశకర్తలు గాఁగ బైబిలునందు.

పితల పేరెఱుఁగని సుతు లెందఱేని
స్వీకృతపుత్రులు క్షితిపాలకులకు. 48

*　　*　　*　　*　　*

పెండిలి చట్టముల్ మెండైన యిపుడు
నిట్టి సృష్టివిధాన మెల్లెడం గలదు;
నైశికజారతాఽభావదేశంబు
ఏయెడ నున్నదో యెఱుఁగంగరాదు! 52
అచ్చు కెక్కినవి నేరంబు లటుండ,
లోలో నణంగిన లోపంబు లెన్నొ?

*　　*　　*　　*　　*

నాగరికము హెచ్చిన కొలందిఁ బెండ్లి
కాంట్రాక్టు బేరంబు గాఁజొచ్చె ననఁగ, 56
అపహరణ * బలాత్క్రియలు నాఁడు నేఁడుఁ
బ్రాకృతమతముగాఁ బాటింపఁదగదె?

---

* కాంతాపహరణంబు గల దెందుఁ గన్న;
పురుషాపహరణంబ మరి యద్భుతంబు!
అనిరుద్ధుఁ డెంత చక్కనివాఁడొ యేమొ?
అతని భాగ్యంబె భాగ్యము త్రిలోకముల!

## III

మతముల శాక్తేయమత మాదిమంబు;
ద్వైతచిహ్నార్చన ధర్మ మా నందు.
ద్వైతచిహ్నముల యద్వైతరూపంబు
నర్చించుటయె పండితారాధ్యమతము.
మతగురువులు పట్టమహిషులం గూడఁ
గూడిరి; తద్ధర్మగూఢార్థ మేమొ?
ప్రతివనితయు రాధ, ప్రతి మతగురుఁడుఁ
గృష్ణుఁ; డేత న్మతంబే వాల్లభంబు.
అచ్చటచ్చట నేఁడు వ్యాపించుచున్న
స్వైరానురాగతత్త్వంబు నియ్యదియె.

* * * * *

స్త్రీపురుషాన్యోన్యసిద్ధానురక్తి
మతపూత మైన ప్రేమంబు నిక్కంబు.
అరసి చూడ, పరస్పరాత్మార్పణంబు!
ఈ ప్రేమభావంబె శృంగారరసము,
రసరాజ మనఁజాలి రంజించు హ్లాదిని.
ఇదియె శాంతము శివం బిదియె సుందరము!

ప్రాణిపాత్రలు రహోరంగమం దాడు
నవ్యవిశ్వవిలాసనాటకం బిదియె!

* * * * *

సృష్టిపర్యవసితం బయ్యెది; యైన,
నింద్రియానందనంబే దీని కాది.
పూనికతోడ సంతాననిరోధ
పథ మవలంబించువారల కోర్కె,
సృష్టిబాధ్యత వినా, యింద్రియానంద
మనుభవించు టె కదా యారసి చూడ!

IV

జ్ఞానేంద్రియములు ప్రగ్రహములు గాఁగ
చిత్తంబు కశ గాఁగ చేపట్టి మించి
బుద్ధి సారథి యయి పూన్కిమై నడప,
కర్మేంద్రియతురంగగతులకుం జొక్కి
ఆత్మమహారథుం డాత్మమనోర
థారూఢుఁ డై యహంకారరాజ్యమున
విహరించు విధము జీవితవిధానమ్ము;
ఆనందమే విహారైకాభిలాష.

* * * * *

ఈ విహారానంద మెయ్యది యేని,
తలఁప నింద్రియములే తత్సాధనములు. 92
కర్మేంద్రియములకు జ్ఞానేంద్రియములు
కార్యక్రమనియంతృకము లై చెలంగు.

V

జ్ఞానేంద్రియంబు లై; దైన, ముఖ్యములు
నేత్రంబు ఘ్రాణంబు శ్రోత్ర — మీ మూఁడె
యంగయోగము లేక సంగంబు గూర్చు.
ఇతరేంద్రియంబుల కీ శక్తి లేదు.

* * * * *

ఈయవి తేజంబు వాయు వాకాశ
మనిపించుఁ బంచభూతాత్మకాంగమున. 100

* * * * *

సృష్టిని దృష్టియు స్థితిని శ్వాసంబు
లయమును శ్రవణంబు లక్ష్యం బొనర్చి,
పరమాత్మబింబ మై పరఁగు జీవాత్మ
మూర్తిత్రయి యనంగఁ బొల్పెసలారు; 104

* * * * *

ప్రాణుల నీ మూఁడె బాహ్యప్రపంచ
వాసనలం బట్టి వర్తిల్లఁజేయు;

ఎంత జితేంద్రియు లేనియున్, వీని
త్రిప్పలం బడినవారే యెప్పుడేని!

## VI

సౌందర్యసౌరభసంగీతములకు
కనులు ముక్కులు చెవుల్ గడియలువడునె?

అంధంబు పీనసవ్యాధిపీడితము
బధిరంబు గాని-చో, వాని వైభవము
కనక మూర్కొనకయు వినక యె ట్లుండు
నే ప్రాణియేనియు నీ ప్రపంచమున?

సహృదయుల్ సమ్మోహజనకంబు లైన
యీ విషయముల లీలావిలాసముల

నప్రయత్నంబుగా ననుభవించెదరు;
ఆనందపారవశ్యంబు నందెదరు!
దేవతావిగ్రహతృప్తి కటంచు
నివి గూర్చువారు తా మేల మానెదరు?

వ్యాజంబుతోడి యాత్మానందనార్థ
తంత్రంబ యర్చనోత్సవవిధానంబు!

* * * * *

జోగు లీ యానందయోగముల్ వదలి
త్రిపుటిని బట్టి బంధింపఁగా నేల ?
ప్రత్యక్షజీవాత్మ భజియింపలేని
జడచిత్తులకు మూర్ఖజనుల కే భంగి
నా పరోక్షుఫుఁ బరమాత్మ లభించు ?
అజ్ఞాని కెట్లు బ్రహ్మజ్ఞాన మబ్బు ?
ప్రకృతిసామాన్యధర్మనిషేధనమున
నిహపరసౌఖ్యంబు లివి రెండు సున్న .

*   *   *   *   *

సర్వసంగత్యాగి సన్న్యాసి యండ్రు ;
అసలె లేకున్నచో, త్యాగం బిఁ కేమి ?
సంగంబ మార్గంబు సన్న్యాసమునకు ;
అపథంబు గాదు, గమ్యస్థలిం జేర్చు,
క్రమనిరుద్ధము లింద్రియములు లోఁబడును,
అవి విజృంభించియు నమితముల్ గావు ;
ఆకస్మికబలాత్క్రియలకు లొంగినను,
అవి విజృంభించి యత్యమితంబు లగును.
పరిమిత మై యగ్ని జ్వలియింపఁజేయు
నాజ్యధారయె, దాని నమిత మై యార్చు ;

కామోపభోగంబుఁ గామాగ్ని నగ్ని
జ్వలియింపఁ జేయ నార్పను సమర్థంబు!
* * * * *
అప్రయత్నంబుగా నానంద మొసఁగు
నీ త్రీంద్రియంబుల నీక్షణేంద్రియము
అభిముఖదిక్కొ కా కన్యం బెఱుఁగదు;
అయినను, దాని మహాత్త్వ మద్భుతము!

VII

త్వగ్జిహ్వలకుఁ బోలెఁ బ్రత్యక్షవస్తు
సంస్పర్శనం బవశ్యంబు గాకున్న,
పరిమళాణువుల సంస్పర్శంబు లేక
ధ్వనితరంగముల సంస్పర్శంబు లేక
ఘ్రాణంబు శ్రోత్రంబు ఘటియింపలేవు
సౌరభసంగీతసౌఖ్య మించుకయు.
అరయం బ్రకాశ — మయ్యది యెయ్యదేని —
అక్షిధర్మంబున కావశ్యకంబు;
అది యనుబంధ మై, యంధకారమునఁ
గనరాని దృశ్యంబుఁ గనఁబడంజేయు;
అంతియ కాని, దృశ్యద్రష్ట లిందు
పరమాణుమాత్ర సంస్పర్శంబు గనవు.

ఎట్టి సంస్పర్శంబు నింతయు లేక
నయనేంద్రియంబు సౌందర్యసౌఖ్యంబు 160
సకలంబుఁ గూర్చు దర్శనమాత్రముననె ;
నిఖిలేంద్రియంబుల నేత్ర ముత్తమము !

* * * * *

అన్యాంగకముల సాహాయ్యంబు లేక
కర్ణపుటంబులు కట్టునంబడవు ; 164
కేవలేచ్ఛామాత్రకీలనంబుననె
నయనంబు నాన బంధనమునం బడును ,
ఘ్రాణబంధనవేళ గడుఁ బరిమితము ;
అక్షిబంధనవేళ యపరిమితంబు . 168
తా సర్వతంత్రస్వతంత్రంబు గాన,
సకలేంద్రియంబులం జక్షు వుత్తమము !

* * * * *

వాయువేగము మాట వల , దది యేల ?
కిరణవేగమును ధిక్కృతముఁ గావించు . 172
దృష్టివేగం ; బదియే మనోవేగ
మనిపించు నాంతరవ్యాపారమందు ;

దానికి వైపును దవ్వును లేవు.
ఎటు గన్న, నుత్తమం బీక్షణేంద్రియము !176

*　　*　　*　　*　　*

బలమునం గూడ నిస్తులితంబు దృష్టి;
ఇదియే మనోబలం బెంచి చూడంగ.
నిగ్రహానుగ్రహావ్యగ్రంబు గాన,
అక్షి యుత్తమ మింద్రియంబులం దెల్ల ! 180

*　　*　　*　　*　　*

ఆధ్యాత్మికముగ బాహ్యప్రపంచంపు
సృష్టిస్థితులను నిర్దేశించు దృష్టి,
దాని యభావంబ తలఁపించు లయము;
ముమ్మూర్తు లేకమైన మూర్తి నేత్రంబు ! 184

*　　*　　*　　*　　*

రసమె యానందంబు, బ్రహ్మంబు నదియె !
అది యొప్ప మోమునం; దంతకు మించి
యొప్పఁ గంట ననంగ, నూహింపరాదె
దాని యున్నతి ? వేఱె తడవ నేమిటికి? 188

*　　*　　*　　*　　*

స్త్రీపురుషాన్యోన్యశృంగారజనక
సౌందర్యమే మహాసౌందర్య మగును;

అదియె నేత్రానంద మన్నింటికంటె
హెచ్చుగాఁ గలిగించు నెల్లప్రాణులకు !

VIII

సౌందరీనాయిక సరసాగ్రగణ్య ;
తాను భోగింప కితరుల కార్తియ
భోగభాగ్యం బిచ్చు త్యాగిని గాన ,
పంచకన్యల మించు పరమపవిత్ర !
ఏకకాలమునం దనేకనాయకులఁ
దనియించుఁ గాన, నందఱికన్న మిన్న !
ఈ కన్యకను స్మరియించినయంత ,
పాతకభీతి సర్వంబు నశించు .

* * * * *

స్పర్శనాదులు లేక దర్శనమాత్ర
సౌందరీనాయికాశతసహస్రముల
నేకకాలమున రమించి రహించు
లోచనశృంగారలోలనాయకుఁడు !
కుబ్జరూపముఁ గనుంగొన నొల్లఁ ; డతఁడు
శ్రీకృష్ణమూర్తి మించిన బ్రహ్మచారి !
ఏతదర్చనము దేవేంద్రార్చనమ్ము ;
స్వర్గసౌఖ్యము సమస్తము భువిం గూర్చు !

* * * * *

సూర్యమండలరశ్మి చొక్కించు మందు ;
కల రూపు తా హ్మముగాఁ జూపు నెందు ,
స్వప్రకాశములు నక్షత్రాదికములు
అంతరించినయట్లు లగు దీని ముందు ;
కాకున్న మకమకం గటకటలాడు.
స్వప్రకాశము లేని చంద్రాదు లిందు
రంగు మెఱుంగులం బొంగారుచుండ్రు ;
విశ్వంబు సర్వంబు విలసిల్లుచుండు !

*          *          *          *          *

సౌందరీలోచనసౌభాగ్య మెల్ల
నీ ప్రకాశంబె, తా నెయ్యది యైన ;
ఉభయుల సంధాన మొనగూర్పఁ జాలు
దూతిక యీ కాంతియే తలపోయ !

*          *          *          *          *

సౌందరీలోచనసరసవిలాస
మీ కావ్యచిత్రమం దిటు వర్ణితంబు !

IX

శృంగారముం బోలె హృది నాటఁ గ్రుమ్మి ,
శృంగార మిందు సాక్షీభూత మగును.

తనుయోగ మించుకంతయు లేని కతన,
శృంగారమునకు శుచిత్వ మిం దొప్పు.
సౌందరీసౌమ్యసుషమ ప్రశస్తంబు,
నయనముల్ దాని యాశ్రయ మపేక్షించు;
కనుక, నీ యుభయశృంగారప్రవృత్తి
కన్వర్థ మగు నుజ్జ్వలాభిధానంబు!

* * * * *

ప్రకరణోచితముగ రసపోషకముగ
పూర్ణార్థఝడితివిస్ఫురణార్థ మిందు
అంగుల్ ప్రయుక్తంబు లంగార్థమందు;
సరసుల కిది సమంజసము కాకున్నె?

X

భాషయందును మఱి భావంబులందు
స్ఫురణం బపేక్షించి, పూర్వకాలంపుఁ
ప్రామాణికకవుల పద్ధతిం బట్టి
స్వాతంత్ర్యము వహించి సంప్రదాయముల
పాటించి కావ్యంబు వ్రాసినవాఁడ;
ఐన, నీ కాలంబునందలి శాస్త్ర
విజ్ఞానమును గూడ వినియోగపఱిచి
క్రొత్త త్రోవలు త్రొక్కి క్రొత్త పోకడలు

పోవ యత్నించితిం; గావున రసిక
పాఠకోత్తములు నా ప్రతిన యెందన్క—
నిజవిమర్శమునకు నిలువ నేర్చెడినో
నిశ్చయింతురుగాత నిష్పాక్షికముగ !

* * * * *

అన్నింటికంటె నాత్మానంద మెచ్చు;
నాకు ముద్దు ఘటించె నా కృతితనయ.
రసికాగ్రియుఁడు మహారా జుదారుండు
నా కూఁతును వరించి నా కల్లుఁ డయ్యె.
అంతె కా, దతఁడు ప్రేమాతిరేకమున
అతులితగతి నలంకృతను గావించి
యేలుచున్నాఁ డీమె; నిదియె యెంతయును
సంతోషహేతు వీ సందర్భమందు !

శ్రీ

భరద్వాజగోత్రిక

కాళ్లకూరి రాజయామాత్య పుత్రక

రసౌచిత్యరచనాఢ్య

గోపాలరాయరచితము

స్నానఘట్టము

సమాప్తము సమాప్తము

# కవిశేఖరుల యితర గ్రంథములు

**సౌందర్యమంజరి —**

భారతీయ భావ తత్త్వమును ప్రకృతి శాస్త్ర పరిజ్ఞానమును సమన్వయించు నభినవ భావ కావ్యము. (1 రూ.)

**వాల్మీకి —**

తస్కరనాయకుఁడు తాపసకవీంద్రుఁ డగుట, మనఃపరిణామ నిరూపక మగు నభినవ రూపకము. (రూ. 1 2 అ.)

**వసంతసేన —**

గోల్డుస్మిత్తు 'హెర్మిట్టు' ననుసరించిన సరస కావ్యము; దండిభారవుల శైలీలక్షణములు గల వని పొగడఁబడినది. (14 అ.)

**అపూర్వసంఘసంస్కరణము —**

అద్భుత మైన వివిధవిషయిక హేళనకావ్యము. (రామలింగారెడ్డిగారి పీఠిక గలదు.) కన్నడములోనికి పరివర్తితము. (12 అ.)

**నీతికథాసంగ్రహము —**

చిన్న చిన్న కథలు; సులభ మైన పద్యములు. సచిత్రము, సటిప్పణము. బాలికాబాలకు లందఱు పఠింపఁదగినది. (4 అ.)

**చంద్రరేఖావిలాపము —**

జగ్గకవి హాస్యరసప్రబంధరాజము. 'ఈ కృతికి సమముగాఁ గృతి సేకవులును జెప్పఁజాలరు.' సంస్కరించిన కూర్పు. (రు.1)

## ప్రకాశకులు : విశల్యా డిపో వారు

4, ఆచారప్పన్ సందు, జార్జిటవును, మదరాసు